ఓం

# శ్రీనివాస శతకము

(పద్య కవితా సంపుటి)




## చింతలపాటి పూర్ణచంద్రరావు

ప్రథమశ్రేణి తెలుగు పండితుడు

ఘంటశాల - 521 133

కృష్ణాజిల్లా, ఎ.పి.

ప్రథమ ముద్రణము
మార్చి 2000
కాపీలు : 1000



ప్రతులకు :

**చింతలపాటి వేంకట లక్ష్మి**
**W/o. CH. POORNACHANDRA RAO**
Telugu Pandit,
కూచిపూడి – 521 136, కృష్ణాజిల్లా,
(ఫోన్ నెం. : 08671–52717)

వెల : రూ. 45/-

డి.టి.పి.
సిహెచ్.వి.స్వామి, తిరుపతి.

ముద్రణ :
శ్రీ పరాశర్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడు,
చిత్తూరు జిల్లా.

# 'అంకితము'



కీ॥శే॥ 'పండితరత్న' చింతలపాటి లక్ష్మి నరసింహ శాస్త్రిగారు
(1922–1986)

సరస సంభాషణా సంశోభితాత్మచే స్నేహార్ద్ర భావంబుచిందజేసి
సంస్కృతాంధ్ర జ్ఞాన సంపద్విభూతిచే చక్కని గ్రంథాలు సంతరించి,
జాతీయ భాషా విశారదత్వమ్ముచే శిష్యకోటికి లక్ష్య సిద్ధి గూర్చి,
వేదాంత విద్యా వివేకాతిశయముచే పరతత్త్వ బోధనా పటిమ జూపి,

'కావ్యభూషణ' బిరుదాన గణనకెక్కి,
రహిని 'పంచాంగ కర్త'గ ప్రణుతి నొంది,
మహిని 'పండితరత్న' సమ్మానమంది,
చెన్ను మీరె 'లక్ష్మీనరసింహ శాస్త్రి'
అట్టి నా తండ్రికీ పొత్తమంకితంబు!!

ఆచార్య
**జి. వి. సుబ్రహ్మణ్యం**
రిటైర్డు తెలుగు ప్రొఫెసర్,
హైదరాబాదు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

# 'మనిషి పాట'

పద్యాలు వ్రాయటం వేరు, శతకం వ్రాయటం వేరు. పద్యమంటే ఒక భావం యొక్క హృద్యావతారం. హృద్యమైన పద్య శతాన్ని సృష్టించే మహాయజ్ఞం శతకం. శతకం కథ చెప్పే రచన కాదు. కవి తన బాధను బోధను చెప్పుకొనే స్వీయమైన మధుర వ్యధ. కథా రచనలో కవిలోని వ్యధ పరకాయ ప్రవేశం చేస్తుంది. శతకంలో ఆత్మీయంగా, ఆత్మాశ్రయంగా, ఆర్ద్రంగా సొంత గొంతులో పొంగులు వారుతుంది. కథలో కవి తన్మయుడౌతాడు. శతకంలో కవి పూనకం పూనుతాడు. శతకం కవి జీవితంలో ఒక ఆత్మయజ్ఞం. అందులో అతడే అగ్ని, అతడే యజమాని, అతడే ఋత్విజుడు. శ్రీ చింతలపాటి పూర్ణచంద్ర రావుగారు అటువంటి ఆత్మయజ్ఞాన్ని అక్షరమయంగా ఆవిష్కరించారు – 'శ్రీనివాస శతకం' గా.

విశేషమేమంటే శ్రీ చింతలపాటి వారు శతకానికి ఒక నక్షత్ర మాలను, ఉపాయనంగా అందించారు. పంచరత్నాలను కానుకగా ఇచ్చారు. సప్తకాన్ని దక్షిణగా పెట్టారు. ఉపాంగ సుందరంగా శతకం హృద్యంగా కనపడుతోంది. కవిగారి వృత్త రచనా విలాసం ఉపాయనాలలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. ధారాళమైన ఆశు

కవితా ప్రవాహం వృత్తాలలో పరుగులు తీస్తోంది. మనసులోని మాటను మర్మం లేకుండా వేంకటేశ్వరస్వామికి నివేదించుకొనే సంవేదన పద్యంలో వేడిగా వినిపిస్తుంది. లోకం పోకడను లోక నాథునికి నివేదించుకొనే లోకజ్ఞత అందులో రవళిస్తుంది. మచ్చు కొక పద్యం చాలు వృత్త రచనా ప్రవృత్తికి -

'అంతము లేనిదీ జగతియంతయు మాయ యటంచు నేదొ వే
దాంతము పల్కుచుందురు గదా! సభలందున; నుంత వారిలో
గాంతుమె చిత్తశుద్ధిని యొకానొక పట్టున నైనగాని, యే
కాంతమునం దొనర్చెడి వికారములం గను వేంకటేశ్వరా!!'

ఈ వృత్తం కవిగారి చిత్త వృత్తిని బయట పెడుతోంది. వీరు భక్తులు కారు, కానీ ధర్మ సంరక్షులు. వీరు పాండిత్యం ప్రదర్శించుకొనే ప్రగల్భులుకారు, కాని పాండిత్యం అంటే ఏమిటో తెలిసిన వినయ వివేకులు. వీరు సంఘ సంస్కర్తలు కాకపోవచ్చును కాని, సంస్కరణకు కావలసిన ఉత్తమ సంస్కారం కలవారు. వీరు తెగబడి సాహసించే వారు కారు, కాని ఉన్న విషయాన్ని కన్న విషయాన్ని తెగబడి తెలివిగా చేప్పే వారు. ఈ స్వభావం ఉన్న వారు వృత్తాలలో ధూర్జటిలా నివసించిందానికంటె ఆటవెలదులతో వేమనలా ఆటలాడుకో గలరు. అందుకే వృత్తాలలో నక్షత్ర మాలలో వ్రాశారు. ఆటవెలదుల్లో శతకాన్ని సారించారు.

ఆటవెలదిని వస్టీన కవి అచ్చమైన తెలుగు నుడికారాన్ని పుక్కిట పెట్టుకుంటాడు. ఆటవెలది ముద్దు ముద్దుల తెలుగు నుడి కారాలకే ముచ్చట పడుతుంది. చింతలపాటి వారికి ఆటవెలదిని అదుపు చేసే పూర్ణచంద్ర యోగం పుట్టుకతో అబ్బింది. అందువలన ఈ శతకం ఆ ఛందస్సుకు ఒక పథకంలాగా అమరింది.

ఆట వెలదిలో శతకం ఎవరు మొదలు పెట్టినా లోకంలో వేమనతో పోటీ పడుతున్నట్లుగా అనుకుంటారు. వేమన పద్యంతో ఆ కవి పద్యాన్ని పోలుస్తారు. ఆ పోటీలో నెగ్గటం అంత తేలికైన పని కాదు. అయినా ప్రతి కవీ తన ప్రతిభతో ఒక ప్రత్యేకతను చాటు కోవటానికి ప్రయత్నిస్తాడు. మరొక మాటలో చెప్పాలంటే వేమన తరువాత ఆటవెలదిలో మకుటంతో శతకం వ్రాయటం ఒక సాహసం! ఒక సవాల్!

ఈ సత్యం తెలిసి కూడా ఆట వెలదిలో శతకం వ్రాయాలనుకున్న శ్రీ చింతలపాటి పూర్ణచంద్రరావుగారు నిజంగా అభినందనీయులు. ఎందుకంటే – వేమన ఆట వెలది కంటే చింతలపాటి వారి ఆటవెలది ఆటలో, మాటలో, పాటలో తన బాణీ తనదిగా సాగిస్తోంది కాబట్టి. ఈ అంశాన్ని ఎంతైనా వివరించవచ్చు. పఠితకు మిగల్చకుండా పీఠికా కర్త అన్నీ చెప్పివేయటం న్యాయం కాదు. అయినా ఒకటి రెండైనా చెప్పక పోతే మర్యాద కాదు.

వేమన మకుటం ఆట వెలది పాదమంత. చింతపాటి వారి మకుటం మునివ్రేళ్ళంత. పద్యం నాలుగో పాదంలో అయిదింట మూడు వంతులు త్రోసికొనివచ్చి వేమన పద్య వేషాన్నే మార్చి వేసింది. ఈ ఆటవెలది ఎక్కువగా మాటవెలది అయింది.

'మనిషి కట్టు కున్న – ఇనుప గోడలె గాని
కులమతాలు లేవు – కువలయాన,
మంచి మనసుకన్న – మతమేది? కులమేది?
మానవాళి కిలను – శ్రీనివాస!!'

వేమన పద్యంలోని నిర్మాణ శిల్పాన్ని చింతలపాటి వారు

సొంతం చేసికొని సొంతబాణీలో చెప్పుకొన్నారు. ఆయన పద్యం లో ఈయన పద్యంలో మూడవ పాదం ముత్యాలమూట. లోక నీతికి బాట. మానవ ప్రవృత్తికి మేలుకొలుపు పాట. అయితే మొదటి రెండుపాదాలను పలికించే తీరు వేమనది కాదు చింతల పాటి వారిది.

వేమన లోకాన్ని జల్లెడ పడతాడు. చింతలపాటి వారు లోకాన్ని పట్టి చూస్తారు. వేమన అడ్డమొస్తే పడతిడతాడు. చింతలపాటి వారు లోకాన్ని మందలిస్తారు. ఏమైనా వేమన అన్నీ వదులుకొన్న యోగి. కాని చింతలపాటి వారు అన్నీ తెలుసుకొన్న బడి పంతులు. వేమన ప్రబోధిస్తాడు. చింతలపాటి బోధిస్తాడు. ఈతేడా ఆటవెలదుల్లో కనబడుతుంది. ఆటవెలదిని చేపట్టినా చింతలపాటి వారు అన్నమయ్య కావాలనుకుంటాడే కాని వేమన కావాలను కోడు. ఈ మాట వినండి –

'అన్నమయ్య వోలె – ఆరాధకుడనౌచు,
త్యాగరాజు రామ – తత్త్వమరసి
మానవత్వమున్న – మనిషిగా బ్రతికెద
క్షితిని మేలు గూర్చు – శ్రీనివాస!!'

యోగిగా ఆటవెలదిని ఆడించటం ఆనాటి వేమన ధర్మం. మనిషిగా ఆటవెలదిని గౌరవించటం పూర్ణచంద్రుని ఈనాటి కర్తవ్యం. వారి ఆకాంక్షను శ్రీనివాసుడు సఫలం చేయాలని మనసారా కోరుతూ, నోరారా అభినందిస్తున్నాను.

శ్రీవాణి, 1-8-702/105, నల్లకుంట,
హైదరాబాదు – 500 044
ది 15.1.2000, సంక్రాంతి. – జి.వి. సుబ్రహ్మణ్యం.

**సముద్రాల లక్ష్మణయ్య,** ఎం.ఏ.,
**మాజీ కార్యదర్శి, ధర్మ ప్రచార పరిషత్,**
**తిరుమల తిరుపతి దేవస్థానములు.**
**తిరుపతి.**

తెలుగులో శతక సాహిత్యం అతి విస్తృతంగా వృద్ధి చెందింది. లోకోత్తరమైన సంస్కృత సాహిత్యంలో సైతం తెలుగులో వలె శతక సాహిత్యం పెంపొందలేదు.

భక్తి, నీతి, లోకవ్యవహారం మొదలైన ఎన్నో అంశాలను శతక కవులు తమ రచనలలో రమణీయంగా ప్రతిపాదించారు. శ్రీకాళహస్తీశ్వర శతకం, సుమతీ శతకం, భాస్కర శతకం మొదలైనవి బహుళ ప్రచారం పొందాయి. ప్రాక్తన కవుల ననుసరించిన ఆధునిక కవులనేకులు శతకాలను కోకొల్లలుగా రచించారు.

కవిత్వాన్ని అభ్యసించే రోజుల్లో శతక రచన కావించడం కవుల సంప్రదాయం. అందువల్లనే పద్య రచనా వ్యాసంగం వెనుకబడి పోయిన ఈ రోజుల్లో కూడా కవులు శతక రచన కావిస్తూనే వున్నారు.

**శ్రీ చింతలపాటి పూర్ణచంద్రరావు**గారు రచించిన '**శ్రీనివాస శతకం, వృత్త సంకీర్తనం**' అన్న రచనలు పరిశీలించాను. శ్రీ పూర్ణచంద్రరావు గారు విద్వత్కుటుంబంలో జన్మించారు. '**పండితరత్న**' శ్రీ **చింతలపాటి లక్ష్మనరసింహశాస్త్రి**గారి కుమారులు వీరు. వీరి తండ్రిగారు 'జ్ఞానవాశిష్ఠానువాదం' మొదలైన గ్రంథాలు రచించిన

పండిత ప్రకాండులు.

వీరు 'విద్వాన్' పట్టభద్రులై కృష్ణాజిల్లాలో ప్రథమ శ్రేణి తెలుగు పండితులుగా పని చేస్తున్నారు. కవితలోనే కాక థార్మిక ప్రవచనం లో కూడా నైపుణ్యం కలవారు. అనేక సంస్థలలో ప్రసంగించి శ్రోత లను అలరించిన వారు. శ్రీ సత్యసాయి సేవా సమితి సభ్యులుగా పలు సమాజ సేవా కార్యక్రమాలలో అగ్రగామిగా వున్నారు.

కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి నుద్దేశించి 'శ్రీనివాస' అన్న మకుటంతో శ్రీ పూర్ణచంద్రరావుగారు రచించిన శతకం భక్తిభావ బంధురమై సహృదయావర్జకంగా అలరారు తున్నది. ఇందలి పద్యాలు రమణీయ రచనా సౌభాగ్యంతో విలసిల్లి భావుకులు భావించే కవులని చవులూరుతున్నాయి.

''భద్రకరములైన – భవదంఘ్రియుగ్మంబు
శ్రీకరంబు మాకు – శ్రీనివాస''

అన్నచోట 'భద్రకరము' అనే మాట 'మోక్షప్రదము' అనే అర్థాన్ని సూచిస్తూ –

''పార్థాయ తత్సదృశః సారథినా త్వయైవ
యౌదర్శితే స్వచరణౌ శరణం వ్రజేతి।
భూయోఽపి మహ్యమిహతౌ కరదర్శితౌతే
శ్రీవేంకటేశ చరణౌ శరణం ప్రపద్యే॥'' అన్న

శ్రీవేంకటేశ్వర ప్రపత్తిలోని శ్లోక భావాన్ని స్మరింపజేస్తున్నది.

''చెట్టు చేమలన్ని – ఛేదించి వేసినన్
వన్య మృగములన్ని – వలసబోవు,

నిలువ నీడలేక – నీరసింతురు జనుల్
జీవితాశ విడిచి – శ్రీనివాస॥''

అన్న పద్యం నేటి పర్యావరణ సమస్యను వ్యక్తం చేస్తున్నది.

''చదువు 'కొన్న' వారి – సరసత్వ మంతయు''

ఇత్యాది పద్యాలు నేటి సమాజ స్థితికి దర్పణం పడుతున్నవి. వీరు తమ రచనలో –

''నొసలు వెక్కిరింప – నోరు మాటాడెడి''

''అందినపుడు జుట్టు – అందకున్నను కాళ్ళు''

ఇత్యాదిగా కొన్ని సామెతలను సందర్భానుసారంగా ప్రయోగించి తమ రచన విలువ పెంచుకున్నారు.

ఇక 'వృత్త సంకీర్తన' భాగంలో 'శ్రీ వేంకటేశ్వర నక్షత్రమాల'లో వృత్తాల రచన మధురంగా, మంజులంగా సాగి మాననీయమై వున్నది. మనోజ్ఞమైన ఊహలతో, చక్కని ఉపదేశాలతో, ఇంపైన పదజాలంతో రచింపబడిన ఈ గ్రంథం పాఠకులకు అమందానంద సంధాయకం కాగలదని ఆశిస్తున్నాను.

పద్యాలపై మోజు తగ్గిన ఈ రోజుల్లో పాఠకులను, శ్రోతలను ఆకర్షించే విధంగా పద్య రచన సాగించి శ్రీనివాసుని దయకు పాత్రులైన పూర్ణచంద్రరావుగారిని మనసారా అభినందిస్తున్నాను.

**ఫోన్: 30679, 18-1-84,**
**కె.టి. రోడ్డు, తిరుపతి,**
**ది. 26.8.1999.** **– సముద్రాల లక్ష్మణయ్య.**

'సరస్వతి కంఠాభరణ'

**డాక్టర్ ప్రసాదరాయ కులపతి,**

శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు,

రిటైర్డు ప్రిన్సిపాల్, హిందూ కళాశాల,

**గుంటూరు - 522 001.**

# 'అభినందన'

**చింతలపాటి పూర్ణచంద్రరావు**గారు తిరుపతిలో నేను చదువుకొనే రోజుల్లో సమకాలికులు. చాల కాలానికి వీరి తండ్రి గారు **'పండితరత్న' శ్రీ చింతలపాటి లక్ష్మనరసింహ శాస్త్రి**గారు తమ తపఃఫలితంగా రచించిన **'కూచిపూడి-భాగవతులు'** అనే అపురూప మైన గ్రంథానికి అభిప్రాయం వ్రాయటం కూడా జరిగింది. మళ్ళీ ఇన్నాళ్ళకు శ్రీ పూర్ణచంద్రరావుగారు వారు రచించిన **'శ్రీనివాస' శతకానికి** అభిప్రాయం కోసం వచ్చారు. ఎన్నేండ్లు గడిచినా చెక్కు చెదరని వారి అభిమానం, పెరిగిన గౌరవం నా చేత నాలుగు మాటలు వ్రాయిస్తున్నవి.

పద్య కవితకు ఆదరం తగ్గిందని చాలా మంది భావిస్తున్న కాలంలో సాహితీ సరస్సులో ఉదయించిన, వికసించిన కమనీయ కమల మీ కావ్యం. ముక్తక జాతికి చెందిన ఈ శతకంలో భక్తి, సామాజిక స్పృహ, లౌకికాలౌకిక భావ సమ్మేళనం అన్నీ సమరస ధోరణిలో కలసి కనిపిస్తున్నవి. పద్యం హృద్యంగా ఉండాలనీ, అది తళుకు లీనుతూ ఉండాలనీ వీరి అభిప్రాయం 2వ ప॥ లలిత భావ జాలము రావాలంటే చిత్తశుద్ధి ఉండాలనేది వీరి

విశ్వాసం (1వ ప॥)

భక్తిలో ఎన్నో పంథాలున్నా మధుర భక్తి అంటే వీరి కెక్కువ మక్కువ (4వ ప॥). కష్టాలలో ఉన్నప్పుడు గళమెత్తి పిలిస్తే ఏడు కొండల వాడు పరుగెత్తుకొని వస్తాడని, ఆయన ఆర్తత్రాణ పరాయణుడని వీరి దృఢమైన నమ్మకం (12వ ప॥). భాగవతంలో పోతనగారు 'నీ పాదార్చకుల తోడి నెయ్యము' నర్థించినట్లుగా 'జన్మజన్మలందు సత్సంగ మిమ్మని పూర్ణచంద్రరావు గారు 20వ ప॥ లో ప్రార్థిస్తున్నారు. పూవు వాడిపోయే వరకు వాసనలు వెదజల్లు తూ చివరకు రాలిపోతుంది. బ్రతుకూ అంతే. అయితే 'నేల బడక ముందే – నీ యుక్కి గమనించు రీతులెల్ల తెలుపుమని 27వ ప॥ లో శ్రీనివాసుని రచయిత వేడుకొంటున్నాడు. సత్సంగం ఎంత అవసరమో దుస్సంగం అంత పరిహార్యమని 'కుటిల జనుల తోడ కూడ రాదిలపైన' అని కవి 48వ ప॥లో కొచ్చరిస్తున్నాడు.

ఈ విధంగా ఆటవెలదులతో వేంకటేశ్వరునకు అష్టోత్తర శత పుష్ప మాలిక తీర్చి అంతతో సంతృప్తి చెందక వృత్తాలలో, గీతాలలో, స్వామిని స్తుతించారు. అవి కూడా ఎంతో రస రమణీయంగా, భావ భరితంగా భాసిస్తున్నవి. ఇంత చక్కని రచన చేసిన పూర్ణచంద్రరావుగారిని అభినందిస్తూ ఈ గ్రంథం సహృదయ హృదయంగమం కాగలదనీ, శ్రీనివాసుని కరుణకు పాత్రం కాగలదనీ ఆశిస్తున్నాను.

భద్రమస్తు!

గుంటూరు,
15.12.1999. – డాక్టర్ ప్రసాదరాయ కులపతి.

'సహస్రావధాని'
**డా॥ మేడసాని మోహన్**
డైరక్టర్ ఆఫ్ అన్నమాచార్య ప్రాజె॰, టి.టి.డి.,
తిరుపతి - 51⁻ 50⁻.

# 'భక్తి భావ ముకురం - శ్రీనివాస శతకం'

'శత' శబ్దం అత్యంత విలక్షణమైనది. మన ఆర్ష దృష్టికి మూల భూతమైనది. ఈ దేశంలో పుట్టిన ప్రతి భారతీయుడు 'జీవేమ శరదశ్శతమ్', 'నందామ శరదశ్శతమ్' అని భావించడం పరిపాటి. 'అశ్వావంతం శతగ్వినమ్' అన్న పంక్తులు ఇందుకు మరో చక్కని ఉదాహరణ. శతము అనడానికి బదులు 'శతకమ్' అన్న పదం మన వాఙ్మయంలో ప్రచారం పొందింది. ఇందలి 'కన్' ప్రత్యయం స్వార్థమున వాడబడటం వల్ల అర్థ భేదము లేదు.

తాళ్ళపాక అన్నమాచార్యుల శతక రచనలకు ముందే వృషాధిప శతకము వంటి గ్రంథములు తెలుగులో ఉన్నట్లుగా సాహిత్య చరిత్ర తెలియ జేస్తున్నది. శతకాలు ప్రధానముగ భక్తి శతకములుగ, శృంగార శతకములుగ, నీతి శతకములుగ గోచరిస్తున్నాయి. తెలుగువారికి గర్వకారణమైన ప్రబంధములలోని కవిత్రయ రచనలలోని పద్యములు రాని వారు కూడా ఆంధ్ర దేశములో ఉన్నారు. కానీ అంతో ఇంతో అక్షర జ్ఞానం ఉన్న ప్రతి తెలుగువాడికీ సుమతీ శతకం, భాస్కర శతకం, వేమన శతకం వంటి శతకములలోని పద్యములు కొన్నైనా నోటికి వచ్చునన డంలో అతిశయోక్తి లేదు. కొంత తెలుగు సాహిత్య జ్ఞానమున్న

వారికైతే ధూర్జటి 'కాళహస్తీశ్వర శతకం', కాసుల పురుషోత్తమ కవి 'ఆంధ్ర నాయక శతకం', గోగులపాటి కూర్మనాథకవి 'సింహాద్రి నారసింహ శతకం', కంచెర్ల గోపన్న కవి 'దాశరధీ శతకం' ఆ జీవనం మరువ లేనివి.

ఈ శతక సాహిత్య ప్రక్రియా రచన ఆధునిక కవిత్వ ప్రభంజనం లో కొట్టుకు పోలేదు. నేటికీ తన అస్తిత్వాన్ని నిలబెట్టు కొంటోంది సగర్వంగా. ఈ నేపథ్యంలో చెప్పుకోదగ్గ శతకం శ్రీ **చింతలపాటి పూర్ణచంద్రరావుగారి 'శ్రీనివాస శతకము'**. భక్తిభావ సమన్వితమైన వీరి శతకంలోని ప్రతి పద్యంలో ఆవేదనా భరితమైన వీరి హృదయ స్వచ్ఛత, ఆర్ద్రత మంచుగా కురిసి అవి ముత్యాలై మిలమిలా మెరుస్తున్నాయి. తేట తెలుగులోని అచ్చమైన ఈ కవితా మాధుర్యానికి శ్రీనివాసుని యందున్న భక్తియే మూల కారణము.

'మాయజాలమెల్ల - మంత్రముగ్ధులజేయ
పరమ యోగులైన - బ్రమయు చుంద్రు
ఆరణేయు జన్మ - కాధార మదిగాదె
చిన్మయాంతరంగ - శ్రీనివాస!!'

భగవల్లగ్నమైన చిత్త పరిపాకం భక్తి. అది యఖండమైన చిన్మయానందం కోసం ఆవేదన పడుతుంది. ఇందుకు భ్రమను తొలగించుకొనే శక్తి కావాలి. అందుకూ స్వామినే ఆశ్రయించాలి. కర్మబంధాలన్నింటికీ శ్రీనివాసుడే సూత్రధారి. అందుకే కవి ఇలా అంటున్నాడు.

'పాప పుణ్య కర్మ - ప్రారబ్ధ విభవమ్ము
కాల గమనమందు - కట్టు గట్టి

జనన మరణ దుఃఖ – మనుభవింపగ జేయు
శిక్షకుండవీవె – శ్రీనివాస!!'

మనో రుజాలను తొలగద్రోసి, అమలిన భక్తితో శ్రీనివాసుని భావిస్తే సకల సంపత్స్వరూపుడు అంతరాంతరాలలోనే సాక్షాత్కరిస్తాడు.

'సర్వ భూతములకు – సాక్షిగా నిలుచుండి
ధర్మముద్ధరింప – తనువుదాల్చి
అంతరాంతరాల – ఆత్మగా వెలుగొందు
చిన్మయుండ వీవె – శ్రీనివాస!!'

అంతస్సంవాద జనితమైన ఈ సంవలిత శోభ భగవత్పరంగా పర్యవసానం పొందటం వల్లే శ్రీనివాసుని సత్యస్వరూపం పూర్ణచంద్రరావుగారి పద్యాలలో దర్శనమిస్తున్నది.

'యాగ భాగ చయము – లారగించెడిదేవ!
బ్రతుకులోని యనుభ – వాల నిటుల
విన్నవించుకొంటి – వినయమింపెసలార
శ్రేయ మొనరజేయు – శ్రీనివాస!!'

కవి యజ్ఞభోక్తకు తన అనుభవాలను విన్నవించుకొన్నాడు. జలజనాభునికి ప్రీతి కలుగునట్లు శతకాన్ని సమకూర్చారు. ఇందుకు అనుబంధంగా ఉన్న 'వృత్త సంకీర్తనము' మరో అనుబంధము వీరికి స్వామితో

'సురుచిర రూప సంపదల సోయగముల్ వెలయించువాడవై
పరమ మునీశ్వరేశ్వర తపః ఫల కాంతుల చెన్ను మీరుచున్

కరమనురక్తి మీర మమకారములన్నియు డుల్లజేసి యీ
ధరణిని గాచు పెద్ద సరదారుడ వీవెగ వేంకటేశ్వరా॥'

పరమ ప్రేమ రూపమైన భక్తితత్వాన్ని వ్యాపింప జేశారు. శుద్ధ సత్వజ్ఞానం ఎలా వెలుగుతుందో అది అజ్ఞానాన్ని దహింపజేసి భక్తి జ్ఞాన వైరాగ్యాలను ఎలా చాటుతుందో మనం ఈ కావ్యంలో దర్శిస్తాం. ఇటువంటి ప్రసన్నమైన భావనా తపస్సుకు శతక కవిత్వ రూప ఆకారాన్ని అందించిన శ్రీ **చింతలపాటి** పూర్ణచంద్రరావు అభినందనీయులు. శ్రీ స్వామి వారి కృపకు పాత్రులైనారు.

**తిరుపతి,**

ది. 2.12.1999. — ***డాక్టర్ మేడసాని మోహన్.***

'అవధాన విద్యా వాచస్పతి', 'ఆశుకవితా సమ్రాట్', 'ద్వి శతావధాని'
రాళ్ళబండి కవితా ప్రసాద్
డిప్యూటీ డైరెక్టర్ ఆఫ్ సోషల్ వెల్ఫేర్
మచిలీపట్నం - 52- 002.

# ఇది 'పూర్ణచంద్రుని' పద్య కౌముది

'తిరుపతి కొండపైన పరిధీకృత మంత్ర విశేష శబ్ద సుం
దరమయ వర్తులాంతర సుధామయ హాస సురోచికావళీ
భరిత ముఖాంబుజాత విశుభత్వ మహత్వ దృగంచలాత్తవి
స్ఫురిత మనోజ్ఞ దర్శన వశున్ ననుజేయవె వేంకటేశ్వరా!!'

ఒకానొక బ్రాహ్మీమయ ముహూర్తాన, శరన్మేఘాలు తలపాగాలా చుట్టుకున్న ఆదిశేషుని స్వరూపమైన తిరుపతి కొండపైన స్వర్ణగోపురం క్రింద, అష్టాక్షరీ మంత్రధ్వనుల ప్రాకారం మధ్య స్వామి శ్రీనివాసుని దర్శనం జరిగినప్పుడు అప్రయత్న కృతంగా వెలువడిన పద్యమిది.

మంచు బిందువులు ముక్కు పుడకలుగా ధరించిన పూల కన్యలు స్వామి పాదాలపై పడి మురిసి పోతున్న శుభక్షణాలలో నేను మానవుణ్ణైనందుకే స్వామి సమీపంలో ఉండి పోయాను. పూవునైతే స్వామి పాదాలు తాకేవాణ్ణి - పరవశించేవాణ్ణి. సాలోక్య - సామీప్య - సారూప్య - సాయుజ్య స్థితులలో రెండింటిని మాత్రమే అర్చా విగ్రహం దగ్గర - భౌతిక శరీరంతో పొందగలిగాను. అదంతా ఒక భౌతిక కాలమాన పరిస్థితులలో దొరికిన అనుభూతి.

అనుభూతులు మూడు రకాలు. భౌతికమైన అనుభూతి - మానసికమైన అనుభూతి - ఆధ్యాత్మికమైన అనుభూతి. జన్మ సంస్కారాలను బట్టి అనుభూతుల విభూతి లభిస్తుంది.

'అనుభవాల గూటిలో
అనుభూతులను పొదిగే గుడ్డు గుండె
సమయం రాగానే
ముక్కుతో పొడిచి వేగంగా ఎగిరిపోయే
విహంగం కవిత...

కవిత్వం ఒక ఆత్మీయమైన అనుభూతికి అక్షర రూపం - శబ్ద రూపం. శూన్యంగా ఉన్న విశ్వం నుంచి పదార్థాన్ని సృష్టించడానికి బ్రహ్మకు ఎంతటి సాధనా నేపథ్యం ఉంటుందో - శూన్యంగా ఉన్న మనస్సు నుంచి కవితా పదార్థాన్ని సృష్టించడానికి కవిబ్రహ్మ కు అంతటి వేదనా నేపథ్యముంటుంది.

ఆ వేదన ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణిస్తే -
ఆ వేదన సామాజిక నిష్ఠమైన అంశాలతో పల్లవిస్తే -
ఆ వేదన స్వీయానుభవాల పౌష్కల్యంతో ప్రభవిస్తే -
ఆ వేదన సార్థకమౌతుంది. పరమార్థ ప్రదాయకమౌతుంది. అలాంటి కృతికి ఆకృతి శ్రీ చింతలపాటి పూర్ణచంద్రరావుగారి శ్రీనివాస శతకం.

శ్రీ చింతలపాటి పూర్ణచంద్రరావుగారు ప్రథమ శ్రేణి తెలుగు పండితులు. ప్రథమ శ్రేణి ప్రభుత్వ రీత్యానే కాదు. పాండిత్య రీత్యా కూడా. గళమెత్తితే తెలుగు పద్యం గగన గంగాఝురిలా ప్రవహిస్తుంది. కలమెత్తితే తెలుగు పద్యం మందాకినీ సౌంద

ర్యాలను ప్రకటిస్తుంది. భువన విజయాలలో, కవన విజయా లలో, కైలాసనాథ సభలలో, సరస్వతీ సామ్రాజ్యంలో, సాహిత్య సమ్మేళనాలలో వీరి పాత్ర సునిర్వచితంగాను – సుస్వర భరితం గాను సమయోచిత సద్యఃస్ఫూర్తి వన్మధుర వచోరిమలలో సాగు తుంటుంది.

రక్త నిష్ఠమైన భారతీయ సంప్రదాయం – సంస్కార నిష్ఠమైన వినయశీలం వీరి జీవన రేఖకు రెండు వైపుల అద్దిన బంగార పుటంచులు.

శ్రీనివాస శతకం 'శ్రీనివాస' మకుటంతో సాగే ఆటవెలది పద్య సమాహారం; అష్టోత్తర శతం, సంకీర్తనా పరంగా ఉత్పల, చంపకాలు ఓ నక్షత్రమాల. ఆపై నివేదనా పంచకం. చివరకు ఆకాంక్షా సప్తకం.

అంటే ఈ పద్య సమాహారంలో 110, 27, 5, 7 సంఖ్యా విభాగాలున్నాయి. వెరశి 149 పద్యాలు. ఇవన్నీ యాదృచ్ఛికాలు కావు. ఒకానొక సంఖ్యా దేవతా ప్రేరక ప్రతి రూపాలు.

''సారహీన మైన – సంసార చక్రాన
తిరుగు చుంటి దారి – తెన్ను లేక
దారి జూపి బ్రతుకు – ధన్యమ్ము జేయుమో
దీన జన శరణ్య – శ్రీనివాస!!''

ఆర్తి... కవి తన స్థితిని స్వామికి సూటిగా నివేదించిన ఆర్తి. ప్రతి పదం దాని అర్థాన్ని మించిన పరమార్థాన్ని పలుకుతుంది. అలా పదాన్ని వాచ్యార్థంలోకాక, వ్యంగ్యార్థమునుగాక, పరమార్థంలో పలికించడం ఆధ్యాత్మకావ్యాల ప్రత్యేకత. దారి

- చక్రం - దారి చూపడం ఇవన్నీ మామూలు పదాలే. కానీ ఆధ్యాత్మిక సాధనా మార్గంలో అవి విశిష్టార్థ ప్రదాయకాలు. ఎవరి ఊహా పరిధి మేరకు వారికి అందులోని అర్థం ద్యోతక మౌతుంది.

ఈ పద్యం మరో ఉదాహరణ -

'దివిని భువిని వెదుక - దృక్కుల గనరావు
హృదయ కుహర మందు - నొదిగి యుండి
గారడీడు వోలె - కనుకట్టు గట్టెదు
చిత్ర చిత్ర గతుల - శ్రీనివాస!!'

మకుటానికి ముందు సంబోధించే తీరులో ఓ ప్రత్యేకత ఉంది. 'దీన జన శరణ్య' అని ఆర్తిలోను, స్వామి వారి గారడీని 'చిత్ర చిత్ర గతుల' అనీ అలాగే ప్రతి పద్యంలో స్వామిని సంబోధించే సంబుద్ధులన్నీ సార్థకంగా ఉండడం ఒక మంచి గుణం.

కేవలం ఛందస్సు కోసం దొరికిన పదాలు ఏరుకొని కూర్చడం కాదు. సాధారణంగా 'శతక రచన' అంటే మహా కావ్య రచన అనే పరీక్ష ఉత్తీర్ణత నందడానికి ముందుగా వ్రాసే ప్రవేశ పరీక్ష. కానీ ఈ కవి ప్రవేశ పరీక్షలోనే మహా కావ్య రచనకు చెందిన ప్రశ్నలన్నీ వ్రాసేశారు. ఈ పద్యం చిత్తగించండి!

'యాగ భాగ చయము - లారగించెడి దేవ।
బ్రతుకులోని యనుభ - వాల నిటుల
విన్నవించు కొంటి - వినయమింపెసలార
శ్రేయ మొనర జేయు - శ్రీనివాస!!'

వైదిక ధర్మసత్యాన్ని జీవనానుభవాలలో సమీకరించి స్వామిని వేడుకొనే తీరు ఎంతో సహజ సుందరంగా ఉంది.

ఇలాగే ఎన్నో పద్యాలు ఉట్టంకించవచ్చు. కానీ పాఠకుల ఊహావైశాల్యానికి వదిలేస్తున్నాను. ఆటవెలది వంటి జాతీయ ఛందస్సునేకాక అక్షరగణ ఛందస్సులైన ఉత్పల, చంపకములు గూడ వీరు బాగా నడిపించారు. చక్కటి ధార, చిక్కటి భావం, ఇంపైన పద విన్యాసం, ఆర్తి, ఆర్ద్రత, ఏకాగ్రమైన ధోరణి ఈ వృత్త సంకీర్తనంలో కనిపిస్తుంది. యతి, ప్రాసలను అలవోకగా దాటడం ముచ్చటేస్తుంది. పద్య రచనా నిర్మాణంలో మెళుకువలు వీరికి వెన్నతో పెట్టిన విద్యలా కనిపిస్తుంది.

'సారము లేనిదే యగు, విచారము జెందగ నేల తాము సం
సారము గూర్చి...'

ఈ పద్యధారలో యతి - ప్రాస ఎలా అమరాయో, సంస్కృత శ్లోకంలో యతి - ప్రాసల వద్ద ఆగడమే ఛందం. తెలుగు పద్యంలో యతి - ప్రాసల వద్ద ఆగకుండా సాగడమే అందం.

తెలుగు పద్యం ఈ శతాబ్దాంతంలో తిరిగి తన విశ్వ రూపాన్ని చూపుతోంది. తెలుగువాడి సాహిత్యపు శాశ్వతమైన చిరునామా పద్య సాహిత్యంలో ఉందని తెలుసుకుంటున్నారు. ఈ నేపథ్యంలో చింతలపాటి వారు పద్య విద్యాధరులు బయల్దేరారు. వారి పద్య శక్తి నిరంతరాయంగా కొనసాగాలని శ్రీనివాసుణ్ణి వేడుకొంటున్నాను. వీరి నుంచి ఒక గొప్ప కథా కావ్యాన్ని ఆశించడం అత్యాశ కాదనుకుంటున్నాను...

తెలుగు పద్య కవితాసతి నొసటన పూర్ణచంద్ర తిలకం దిద్దినట్లుంది శతకం. పఠించండి - తరించండి.

మచిలీపట్నం,

ది 20.12.1999. — **రాళ్ళబండి కవితా ప్రసాద్.**

డా॥ చింతా రామనాథం
ప్రిన్సిపాల్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం,
కూచిపూడి – 521 136.

# 'ఓమ్ నమో భగవతే శ్రీనివాసాయ నమః'

'వెన్నెల వంటిది శ్రీ వేంకటేశు మంత్రం' అంటాడు ప్రథమాంధ్ర సంకీర్తనాచార్యుడు తాళ్ళపాక అన్నమయ్య. కలుషిత వాతావరణంలో నైతిక విలువలు కర్పూరము వలె హరించుచున్న ఈ సమాజములో జీవించుట కష్టముగ నున్నది. కావున దీనికి దూరముగ శ్రీనివాసునకు దగ్గర ఉపవసించుచు శ్రీమన్నారాయణుని తలచుకొనుచు తరించుటకు వికలమైన మనస్సుతో ప్రార్థిస్తున్నాడీ శతక కర్త **చింతలపాటి పూర్ణచంద్రరావుగారు.** కళ కళకొఱకు గాక కవిత్వ కళతో తనతోపాటు ఇతరులకు గూడ నొక ముక్తి పథాన్ని నిర్దేశించమని శ్రీనివాసునిణ్ణి ప్రార్థిస్తూ ప్రాథేయ పడుతున్నాడు. ఆత్మీయతను వెల్లడించు చున్నాడు.

ప్రాచీనాంధ్ర వాఙ్మయములో శతక వాఙ్మయము శతథా పండిత పామరులకు ప్రీతి పాత్రమైనది. కంఠస్థమైనది. ఈ శతక రచన నాధారముగ తీసుకొని కవి తన మనోగతాన్ని, అనుభవాన్ని శ్రీనివాసునికి నివేదిస్తూ ఈ సమాజ సమస్యలకు పరిష్కారాన్ని అర్థించుట సముచితముగ, సంస్తూయమానముగ నున్నది. ఇందులకు ప్రతి పద్యమునుదహరింపవచ్చును. ముఖ్యముగ పండిన హృదయము నుండి బాహిర్గిల్లిన ఆవేదన, ఆర్తి కవితా

రూపమును సంతరించుకొని శ్రీనివాసునకు ఆముకుటముతో నైవేద్యమొనర్చిన శ్రీ పూర్ణచంద్రరావుగారు అత్యంత అభినంద నీయులు, అభివందనీయులు.

ఇది చిత్రముగాదు - విచిత్రమును గాదు. పూర్ణచంద్రరావు గారి లాంటి వారి నుండి అస్మదాదులు అభిలషించు విధముగనే ఉన్నత భావాలకు భాషా రూపమిచ్చుట జరిగినది. ఇందులకు కారణము వారిది పండిత వంశము. పితృదేవులు శాస్త్రపారంగ తులు, కవిశేఖరులు, పండితరత్న బిరుదాంకితులు. తాతపాదులు భవిష్యద్వాణికర్తలు. ఇక మాతామహులు సంస్కృతాంధ్ర భాషా కోవిదులు, వైశ్వదేవ పరులు, శాస్త్రవిదులు. కావున పూర్ణచంద్ర రావుగారు అస్మదాదులకు ఆనందము నందించు రీతిలో శతక రచన గావించుటలో విశేషమేమున్నది. అది వారికి వెన్నతో బెట్టిన విద్య. కాగా రాబోయే కాలానికి కావలసిన శతకాన్ని, కాలదోష మంటని శతకాన్ని, సార్వకాలికము, సార్వజనీనమయిన శతకాన్ని అందించిన పూర్ణచంద్రరావుగారు బహుధా శ్లాఘనీయులు. వీరి కలము నుండి కలకాలము నిలిచే కావ్యాలు రావాలని ఆశించుట దురాశ కాదని యనుకుంటూ త్వరలోనే మంచి గ్రంథాలంది స్తారని ఆశిస్తూ...

కూచిపూడి, మిత్రుడు

ది. 14.12.1999. **- డాక్టర్ చింతా రామనాథం.**

**వి. శరచ్చంద్రబాబు** ఎం.ఏ.,
ప్రథమశ్రేణి తెలుగు పండితుడు
జిల్లా పరిషత్ హైస్కూల్,
పటమట.

# అక్షర మందార హారం

ఆధునికాంధ్ర సాహితీ లోకంలో కుల మత సాంఘిక రాజకీయ నేపథ్యాలతో – ఆనాడు ప్రభవించిన అభ్యుదయ సాహిత్యోద్యమం మొదలుకొని, నేడు విస్తరిస్తున్న దళిత, స్త్రీవాద సాహిత్యోద్యమాల దాకా ఆ యా ఉద్యమాలను నిర్వహించే వారూ, ఆ నేపథ్యంలో కవిత్వం వ్రాసే వారూ పద్యాన్ని కాలం చెల్లిన ఒకానొక 'దురాచారం' అన్నట్లు చీదరించుకొనటం వల్లా, అంటరానిదీ, అనాగరికమూ అన్నట్టు 'రోత'గా చూడటం వల్లా – ఈనాటి యువ కవులు పద్యాలు వ్రాయటానికి ఇష్ట పడటం లేదని భావించవచ్చు. అంతేకాదు. ప్రాచీన సాహిత్యాన్ని డొక్క శుద్ధిగా చదువుకుని, ఛందోవ్యాకరణాదులు చక్కగా నేర్చుకొని, సలక్షణంగా పద్యం వ్రాయగలిగిన కొందరు కిందటి తరం కవులు కూడా పద్యాన్ని వదిలేసి వచన కవితా ప్రక్రియను వరించటం శోచనీయం.

కొన్ని శతాబ్దాలపాటు ఏకైక కవితా ప్రక్రియగా తెలుగు సాహితీ సామ్రాజ్యాన్నేలిన పద్యాన్ని పక్కకు నెట్టేసి వచన కవితా ప్రక్రియ ఆ స్థానాన్ని ఆక్రమించుకున్నది అనటంలో అతిశయోక్తి లేదు.

కాకపోతే ఆకాశవాణి సమస్యాపూరణ కార్యక్రమంలోనూ, అడపాదడపా ఏ పండక్కో, పబ్బానికో ఏవో కొన్ని పత్రికల్లోనూ, పద్య కవితా ప్రక్రియే ప్రాధాన్యం వహించే అవధాన సభల్లోనూ మాత్రమే పద్యం ఈనాడు తన ఉనికిని చాటుకుంటున్నది. తెలుగు వారి ప్రత్యేకతలలో ఒకటిగా చెప్పుకోతగిన పద్యం ఆదరణ కోల్పోయి, చివరికి "ప్రాచీన సాహిత్య శిలాజం"గా మాత్రమే చరిత్ర పుటల్లో దర్శనమిచ్చే దయనీయ స్థితి భవిష్యత్తులో కలగకుండా ఉండాలని పద్యాన్ని అభిమానించే వారంతా కోరుంటున్నారు.

ఇలాంటి నిరాశా పూరితమైన వాతావరణంలో చివరి దశలో మినుకు మినుకు మంటున్న పద్య దీపాన్ని ఎగదోసి కవితా స్నేహం పోసి మళ్లీ జాజ్జ్వల్యమానం చేయాలనీ, తెలుగు సరస్వతి ఆలయంలో అఖండ దీపంగా నిలపాలనీ యథాశక్తి కృషిచేస్తున్న వారు అవధాన కవులూ, శతక కవులూను.

అష్ట, శత, సహస్ర, మహాసహస్రాది అవధానాలతో పల్లెల నుండి పట్టణాల దాకా పద్యాన్ని పల్లకీ ఎక్కించి ఊరేగిస్తున్నారు. ఆంధ్రదేశం నుండి అమెరికా దాకా అవధానాలు నిర్వహిస్తూ తెలుగు పద్యపు పరిమళాలను దశదిశలా గుబాళింపజేస్తున్నారు – అవధాన కవులు.

ఇక శతక కవులూ పద్యాన్ని అక్షయంగా అక్షరంగా నిలపటానికీ, తెలుగు పద్యపు తరితీపులు రుచి చూపటానికీ తమ వంతు కర్తవ్యం తాము నిర్వర్తిస్తున్నారు.

అవధానం శ్రావ్యమై మానసికానందాన్ని కలిగిస్తుంటే, శత

కాలు అక్షరబద్ధమై ఆత్మానందాన్ని అందిస్తున్నాయి. కాబట్టి ఈనాడు పద్య కవితా పారిజాతాలు విరబూయాలని కోరుకునే సాహితీ ప్రియులు అవధాన కవుల్నీ, శతక కవుల్నీ ప్రోత్సహించ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

శతకాలు సాధారణంగా రెండు రకాలుగా కన్పిస్తాయి. భక్తి శతకాలూ, నీతి శతకాలూను. సంస్కృతంలో భర్తృహరి ఒకడు మాత్రం నీతి, శృంగార, వైరాగ్య శతకాలు వ్రాశాడు. మరే శతక కవీ ముఖ్యంగా తెలుగు శతక కవులెవరూ భక్తినీ నీతినీ విడిచి మరో భావాన్ని ఆశ్రయించినట్టు కనిపించదు. అయితే ఆధునికు లలో అక్కడక్కడా పకోడీ శతకం, పిల్లి శతకం లాంటివి హాస్యమూ, అధిక్షేపమూ మొదలైనవి ప్రధానంగా కన్పించినా వాటి పరమార్థం కూడా సామాజిక నీతిని ఉద్బోధించటమే అన్నది ఫలితార్థం కావటం విశేషం. ఏతావతా ఆత్మోద్ధరణే పరమ లక్ష్యం గా సాగే కృష్ణ శతకం, సూర్య శతకం లాంటివి భక్తి శతకాలూ, సామాజిక సంస్కారం పరమోద్దేశంగా సాగే సుమతీ శతకం, వేమన శతకం లాంటివి నీతి శతకాలూ అని శతకాలు ముఖ్యంగా రెండు రకాలుగా విభజించుకోవచ్చు. అయితే కవి ఎంత భక్తు డయినా సమాజంలో నివసించే మానవుడే కాబట్టి సామాజిక సమస్యలు అతన్ని చుట్టుముట్టినప్పుడల్లా తాను నమ్మిన భగవంతుడితో మొరపెట్టుకుంటాడు. ఈ మనుషుల వింత మనస్తత్వాలను గురించీ, మంచి చెడులను గురించీ, ఈ సమాజంలో జరుగుతున్న అవకతవకలను గురించీ, కుల మత సాంఘిక ఛాందస భావాలను గురించీ – ఒకటేమిటి తన మనసు స్పందించినప్పుడల్లా ఒక పద్యం ద్వారా తన స్వామికి నివేదించు

కుంటాడు. అలా స్పందించి చెప్పిందే ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వర శతకం. ఇలాంటివి మూడవ తరహా శతకాలు. ఈ కోవకు చెందిందే ఈ శ్రీనివాస శతకం.

ఈ శ్రీనివాస శతకాన్ని రచించిన శ్రీ **చింతలపాటి పూర్ణచంద్ర రావు** కవి పండిత వంశంలో జన్మించారు. వీరి జనకులు **'పండితరత్న' కీ॥శే॥ చింతలపాటి లక్ష్మనరసింహశాస్త్రి**గారు. వీరు సంస్కృతాంధ్ర హిందీ భాషల్లో మహా విద్వాంసులు, కవి వతంసులు. **కూచిపూడి - భాగవతులు, జ్ఞానవాశిష్ఠము, గొల్లకలాపము, త్రిస్కంధ జోతిష్యము** అముద్రితము వంటి ప్రామాణిక గ్రంథాలు వెలువరించిన పరిశోధకులు. ఆస్తిపాస్తుల సంగతేమోకానీ వారు తమ జీవితమంతా సాధన చేసి సంపాదించిన విద్యా ధనాన్ని తన కుమారులకు రెండు చేతులా పంచి యిచ్చిన మహామనీషి. పూర్ణచంద్రరావు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, తిరుపతిలో శ్రీవేంకటేశ్వరుడి పద సన్నిధిలో విద్యాభ్యాసం సాగి స్తూన్న నాటి నుండి దీక్షగా కొనసాగిస్తున్న కవితా వ్యవసాయానికి సాయంగా పిత్రార్జితంగా లభించిన పాండితీ విభవం దోహదం కాగా పండిన పంట ఎంతో ఉంది. అందులో కొంత భాగం మాత్రం కోసి, నూర్చి, రాజనాల రాశిపోశాడు. ఆ రాజనాల రాశే ఈ శ్రీనివాస శతకం.

ఈ కవి నీతినీ భక్తినీ విత్తనాలుగా చల్లి పద్యాలు పండించాడు. ప్రసన్నత, భావ సమగ్రత, సార్వజనీనత ఈ శతకాన్ని ఉత్తమ స్థాయికి చేర్చాయి.

కవిని బ్రహ్మతో పోలుస్తారు - కావ్యలోకాన్ని సృష్టిస్తాడనే కాదు

– అతడు చతుర్ముఖుడని కూడా. కవిలో ఒక పరిశీలకుడూ, ఒక విశ్లేషకుడూ, ఒక బోధకుడూ, ఒక తాత్త్వికుడూ దాగి ఉంటాడు. ఆ నాలుగు లక్షణాలూ పరిపక్వత చెందిన కవి ఋషి.

శ్రీనివాస శతకంలో కవి నాలుగు ముఖాలూ కన్పిస్తాయి. వాటి పరిపక్వస్థితి కూడా గమనిస్తాము.

ఉన్నవాడెపుడును – ఉన్నవాడికె బెట్టు
లేని వాడి కిడడు – లేశమైన
ఉర్విలోని జనుల – ఉపకార భావాల
శీలమిట్టులుండె – శ్రీనివాస! – అని నిట్టూర్చుతాడు కవి.

ఉన్నవాడూ ఉన్నవాడికే పెడతాడు, లేనివాడూ ఉన్నవాడికే పెడతాడు – అని లోకోక్తి. కానీ పరిశీలించి చూస్తే మాత్రం ఉన్నవాడు ఉన్నవాడికి పెట్టటమొక్కటే నిజం. లేనివాడు ఉన్నవాడి చేత దోచుకోబడతాడు. ఉన్నవాడు లేనివాణ్ణి దోచుకుంటూనే వాడికేదో ఉపకారం చేస్తున్నట్టు నటిస్తాడు. ఇది సమాజ సమ్యక్ పరిశీలన వల్ల కవి తెలుసుకున్న నిజం!

## విశ్లేషణ

వ్యసన పరుని జూచి – పరిహసించిరి నాడు
వ్యసన పరుడె నేడు – భవ్యగుణుడు
మంచి చెడ్డలన్ని – మదిలోని మార్పులె
శ్రీరమా విలోల – శ్రీనివాస!

వ్యసనపరుణ్ణి ఆనాడు పరిహసించారు. ఈనాడు భవ్యగుణుడని గౌరవిస్తున్నారు. ఆనాడెందుకు పరిహసించారు? ఈనాడెందు

కు గౌరవిస్తున్నారు? ఇది మంచి ఇది చెడు అని నిర్ణయించేది బుద్ధి. ఆ బుద్ధి ఆలోచించే విధానంలో వచ్చిన మార్పే మంచిని చెడుగాను, చెడును మంచిగాను చూపిస్తుంది.

## ప్రబోధం

ధనము కూడ బెట్టు - తలపు మంచిదె కాని
ధర్మమార్గ మెపుడు - తప్పరాదు.
పరుల నోళ్ల గొట్టి - పైకంబు గడియించు
చెనటికేమి శిక్ష - శ్రీనివాస!

ధనమూల మిదం జగత్. కాబట్టి ధనం సంపాదించాలి. ధన సంపాదన తప్పుకాదు. కాని ధన సంపాదన కోసం ధర్మ మార్గం తప్పటం తప్పు. కాబట్టి ధర్మ సమ్మతమైన పద్ధతిలోనే ధనం సంపాదించాలి. పరుల నోళ్ల కొట్టి తన ఇనప్పెట్టె నింపుకొనే చెనటికి తగిన శిక్ష దైవమే విధిస్తాడు!...

## తత్త్వం

అణువు నణువులోన - నణగి యుండెడి నిన్ను
త్రికరణాలవలన - తెలుసుకొనిన
చావు పుట్టు కనెడి - జంజాటమును లేక
జీవి ముక్తి పొందు - శ్రీనివాస!

అణువు అణువులో నిండి ఉన్న భగవంతుణ్ణి మనసా వాచా కర్మణా ఆరాధించి దర్శించిన పుణ్యాత్ముడు సంసారపు జంజాటం నుండి విముక్తుడై మోక్షాన్ని పొందుతాడు. ఇలా కవి చతుర్ముఖత్వం శతకమంతటా గోచరిస్తుంది. స్థాలీపులాక

న్యాయంగా నాకు తోచిన నాలుగైదు పద్యాలే ఇక్కడ చూపటం జరిగింది. శతకమంతా వివరించి చూపడం సాధ్యం కాదు కదా!

## పరిపక్వత

జన్మ జన్మలందు – సత్సంగ మిమ్మంచు
వేడుకొందు నెపుడు – విమల చరిత
కోరబోను నిన్ను – గొంతెమ్మ కోరికల్
శేషశైలవాస – శ్రీనివాస!!

ఇది పరిపక్వదశ. ఈ విధంగా అర్థ కామాలను త్యజించి నప్పుడే మనిషి మహర్షిగా రూపొందుతాడు. 'నానృషిః కురుతే కావ్యం' కావ్యం వ్రాయటానికి ఋషిత్వ సిద్ధి పొందాలి. పూర్ణచంద్రరావు కి ఋషిత్వం సిద్ధించింది. అంటే అతను గడ్డాలు పెంచుకుని కాషాయాలు ధరించి కారడవులకు వెళ్ళి ఘోర తపస్సుకు పూనుకున్నాడనీ కాదు, లోకాతీత, మానవాతీత శక్తులేవో సంపాదించాడనీ కాదు. భావనాపరమైన పరిపక్వత పొంది కావ్య రచనకు అర్హత సంపాదించాడని అర్థం. ఆ అర్హతతో అతను కావ్య రచనకు పూనుకుని ఉత్తమ కావ్యాలు వెలయిస్తాడని ఆశిద్దాం.

## – ద్వితీయ భాగం –

శ్రీనివాస శతకంలో ద్వితీయ భాగంగా వృత్త సంకీర్తనమ్ చేర్చారు. కవి ఆటవెలదులలో ఎంత తేటతేట కవితల్లల్ల గలడో శ్రీనివాస శతకంలో చూస్తాం. వృత్త రచనలో కవి వృత్త విన్యాసం ఈ విభాగంలో గమనిస్తాం.

ఇందులో నివేదన, వేంకటేశ్వర నక్షత్రమాల, ఆకాంక్ష అనే

శీర్షికలున్నాయి. నివేదన 'ఆరాధన' మాసపత్రికలోనూ, వేంకటేశ్వర నక్షత్రమాలిక 'సప్తగిరి' మాసపత్రికలోనూ, ఆకాంక్ష 'ముముక్షువు' మాసపత్రికలోనూ లోగడ ప్రచురించ బడ్డాయి. ఇవేకాక శ్రీనివాస శతకంలోని పద్యాలన్నీ కూడా లోగడ 'ఆరాధన' మాసపత్రికలో ప్రచురిత మైనవే.

నివేదన, ఆకాంక్ష, శ్రీకృష్ణ భక్తి పూరితాలు. మధుర భక్తి సంప్రదాయానికి చెందిన రచనలు.

ఎప్పటికప్పుడే హృదయమిచ్చి భజింతును, నన్ను జూడకే
తప్పి చరింపు చుందు విది ధర్మమె? నీ హృదయాంబుజాత మం
దెప్పటికైన నీ జనుని నేలెడి కోర్కె జనించునేమొ? యం
చొప్పగ నాస బూని యిటులుంటి గదా! దయజూడరాగదే!

ఇలా మధుర మధురంగా సాగిపోతాయి పద్యాలు.

శ్రీ వేంకటేశ్వర నక్షత్రమాల భావ శబల. భక్తి, నీతి లోకరీతి, ఆత్మ విమర్శ మొదలైన అనేక భావాలిందులో చోటు చేసుకున్నాయి. భాష భావము పోటీ పడి ఝరీధారలై ఉరికిన వృత్త నర్తన మిది. మచ్చుకొక పద్యం రుచి చూడండి.

కొలిచిన నీదు రూపము నకుంఠిత భక్తి గుణంబు గల్గు, తా
తలచిన నీదు నామము సుధారస వాహిని ముంచి యెత్తు, వే
నిలిపిన నీదు తేజము వినిర్మల విద్యలు బోధ జేయునో
కలియుగ దైవమా! పరమ కారుణి కోత్తమ! వేంకటేశ్వరా!

శ్రీనివాస శతకంతోబాటు ద్వితీయ భాగంగా ఈ వృత్త సంకీర్తనం చేర్చి ముద్రించటం ఎంతో యుక్తంగా ఉంది. పద్య

